## గంటల పంచాంగం

ఖర సం॥ జ్యేష్ఠ బ॥ చతుర్దశి
1951 సం॥ జూలై 3 మంగళవారం
ముం॥ చతుర్దశి ప 10-53 వ్య ప 1-36
నక్షత్రం రా 11-2 ల 12-50 కు.
బ॥ అమావాస్య జూలై 4 బుధవారం
బు॥ అను॥ ప 1-17 అర్ద్ర సా 4-34
శు॥ ౧౦ తేదు.


# ఆంధ్రపత్రిక

ఒరు లేయని యొనరించిన నరుడు, యుపేయము గనె మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ జ్యేష్ఠ బ॥ చతుర్దశి
మంగళవారం.


## 'భూమి శిస్తు' సంస్కరణలు

దేశము సందలి భూమి అమరకపు విధానమును సంస్కరించుటకు దాదాపు అర్ధ శతాబ్దముగ ప్రయత్నములు జరుగుచున్నవి. వర్తమాన పరిస్థితులను విచారించి, ముందు జరుగవలసిన సంస్కరణలను సూచించుటకు అధికార, అనధికార సంఘము లెన్నియో ఏర్పడినవి. విచారణలు జరిగినవి. నివేదికలు ప్రకటించుట మాత్రము పూర్తియైనది. ఎస్టేట్లను రద్దుచేయుటను మించి, రాష్ట్ర ప్రభుత్వములు ఏమియు చేయలేదు. జమీందారీలను రద్దుచేసి, సాగుచేయు రైతుకు భూమిని సంక్రమింప చేసిన ధాన్యోత్పత్తి అధికము కాగలదని ప్రభుత్వములు విశ్వసించెను. భూమి స్వంతదారులు మారుట, న్యాయస్థానములందు దావాలు పడుటను మించి, పరిస్థితిలో మార్పు ఏమియు వచ్చియుండలేదు.

జమీందారీ రద్దు శాసనమును ఏ రాష్ట్ర ప్రభుత్వమూ పూర్తిగా అమలు జరుపలేదు. జమీందారులకు పరిహారము చెల్లింపలేదు. జమీందారీలను రద్దుచేయుటకు ప్రభుత్వమునకు అధికారమున్నదా, లేదాయను విషయము కూడ నిర్ధారణ కాలేదు. ఈ పరిస్థితులలో రైత్వారీ విధానమును కూడ సంస్కరించుటకు రాష్ట్ర ప్రభుత్వములు పూనుకొనుట సాహసము. డాక్టరు రాజేంద్రప్రసాదుగారు కేంద్ర ఆహార వ్యవసాయ శాఖా మంత్రిగ నున్నపుడు రైత్వారీ విధాన సంస్కరణ పద్ధతులను సూచించుటకు ఒక ప్రత్యేక సంఘము ఏర్పాటు చేయబడెను. ఆ సంఘమువారు అన్ని రాష్ట్రములందును పర్యటనచేసి ఒక సమగ్రనివేదికను తయారుచేసిరి. సేద్యము ఏ పద్ధతులపై జరుగవలెను? గరిష్ఠ భూవసతి, కనిష్ఠ భూవసతి ఎంతెంతగ నుండవలెను? భూస్వాములకు కౌలుదార్లకు సంబంధములు ఎట్లుండవలెను? మొదలైన అనేక ప్రధాన ప్రశ్నలకు కమిటీవారు సమాధానమిచ్చిరి. సాగు చేయువారికే భూమిపై హక్కు ఉండవలెనని ఈ కమిటీవారు సూచించుటతో, వ్యవసాయదారులందరు కవులుదారులను తొలగించి స్వంతసేద్యము ప్రారంభించిరి. కొందరు తమ భూములను విక్రయించుకొన నారంభించిరి. వ్యవసాయమున ఒక అస్థిరత ఏర్పడెను.

ఆ స్థితినుండి స్థైర్యమును ప్రసాదింపగ కోరుకొనుచుండగ చెన్నరాష్ట్ర ప్రభుత్వము నియమించిన భూమి అమరకపు విధాన సంస్కరణల సంఘ నివేదిక వెలువడినది. కౌలుదారీ పద్ధతికి ఈ సంఘమువారు పూర్తిగ స్వస్తిచెప్పకపోయినను, భూస్వామి - కౌలుదారుల సంబంధములను, ఒక పట్టాదారునకు ఉండదగిన భూవసతి గరిష్ఠ ప్రమాణమును, నిర్ణయించుటవలన తిరిగి పరిస్థితులు అధ్వాన్నము కాగల ప్రమాద మేర్పడినది. అసలు ఈ విచారణ సంఘమును నియమించుచు రాష్ట్రప్రభుత్వము జారీచేసిన ఉత్తరువును గమనించిన ఈ సంఘము భూమి అమరకపు విధానమై గాక, భూమి శిస్తు విధింపు పద్ధతిని గూర్చి ప్రధానముగ విచారింపవలసి యుండెను. కాని కమిటీవారు అసలు విషయమును గాక భూమి అమరకపు పద్ధతికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చి పరిస్థితులను విషమింపజేసెను.

కమిటీవారుచేసిన మొత్తము 126 సిఫార్సులలో ప్రధానముగ ఎన్నదగినవి అయిదారు మాత్రమే యున్నవి. సమష్టి వ్యవసాయ పద్ధతి ఆచరణయోగ్యముగాదను వీరి అభిప్రాయము వెనుకటి విచారణ సంఘముల అభిప్రాయములకు అనుగుణము గనే యున్నది. సాగు పద్ధతులను మార్చుటలో నిర్బంధము ఉండరాదను వీరి సూచన హర్షింప తగినది.

కాని కనిష్ఠ, గరిష్ఠ భూవసతి విషయములో వీరుపూర్తిగ కుమరప్ప కమిటీ సూచనలను తిరస్కరించి, కౌలు విధానమును స్థిరపరచుచు పట్టాదారుకు, కౌలు దారుకు ఉండవలసిన సంబంధములను సూచించి ఒక అవాంతర స్థితిని కల్పించిరి. మొత్తము ఆదాయములో కౌలుదారుకు పదింట ఆరువంతులు, పట్టాదారుకు నాలు వంతులు చెందవలెనను వీరిసూచన ఎంత మాత్రము న్యాయ సమ్మతము గాదని నేటి వ్యవసాయ సమస్యలను విచారించినవారు జువుకాగలదు. వ్యవసాయ ఖర్చులు మొత్తము ఆదాయములో సగము కంటె కూడ మించి యుండునని అనుభవముపై తెలియగలదు. కొన్ని ప్రాంతములందు అన్నీ సవ్యముగనే యున్నను పట్టాదారులకు పెట్టుబడిపై అర్ధ రూపాయి వడ్డీయైనగిట్టుట లేదు. ఇట్టి పరిస్థితులలో కొద్దిపాటి భూవసతి కలిగి స్వంతముగ సేద్యము చేయలేని పట్టాదారులు తమ భూములను అమ్ముకొనుటకంటె చేయగల్గినది లేదు. కౌలుదారులు ఆభూమిని కొనగల స్థితి యందుండరు. పెద్ద స్థితిగలవారే భూములను తమకు అనుకూలమైన ధరలకు కొని తిరిగికట్టుబడి కిచ్చుట జరుగును.

రైతు స్వామ్యము అతి పవిత్రమైన పద్ధతిగ భావించిన ఈ కమిటీవారు ఆపద్ధతికే తమ సంస్కరణల ద్వారా స్వస్తిచెప్పచుండుటను బట్టి వీరు తమ బాధ్యతలను గ్రహించి, వ్యవసాయ పరిస్థితులను గమనించి వ్యవహరింపలేదని చెప్పవలసి వచ్చుచున్నది. వ్యవసాయాభివృద్ధికి ప్రాణప్రదమైన కనిష్ఠ భూవసతి" నిర్ణయింపక, గరిష్ఠ భూవసతిని మాత్రము నిర్ణయించుటవలన కూడ ఈ కమిటీవారు వ్యవసాయ సమస్యలను పూర్తిగ అవగాహన చేసుకొనలేదని చెప్పవలసి యున్నది. ఒక ప్రక్క సాంఘిక న్యాయమును సాధించుటకు భూవసతి గరిష్ఠ ప్రమాణమును నిర్ణయింప వలెనని అంగీకరించుచు, మరొకప్రక్కన ప్రస్తుతము ఈ గరిష్ఠ ప్రమాణమునకు మించియున్న కమతములను కదల్చరాదని సూచించిన ఈ కమిటీవారు పెద్ద పెద్ద భూస్వాముల హక్కులకు భంగము కల్గింపక, స్వయముగ సాగుచేసుకొనలేక, ఉన్నకొద్ది భూమిని కట్టుబడికిచ్చిన మధ్య తరగతివారి హక్కులను రద్దు చేయుటకు సాహసించిరి. ఇట్టి చర్యలు సాంఘిక న్యాయమును ఎట్లు సమకూర్చునో కమిటీ వారికే తెలియవలెను. నివేదిక సంప్రదాయసిద్ధముగ గాని, శాస్త్ర బద్ధముగగాని లేదు. ఈ నివేదిక కాంగ్రెస్ ఎన్నికల ప్రచారమునకు ఉపయోగపడ నచ్చునేమోగాని భూమిశిస్తు విధానమును, భూమి అమరకపు పద్ధతులను సంస్కరించి వ్యవసాయమును సక్రమ మార్గమున నుంచుటకు ఎంతమాత్రము ఉపయోగపడదు.

## టిబెట్టుకు పెకింగ్ ప్రతినిధి వర్గం

కలకత్తా, జులై 1: చైనా సైనిక సంఘ కార్యాలయ డైరక్టర్ జనరల్ చాంగ్-చింగ్-వూ నాయకత్వాన నిరుగురు కమ్యూనిష్టు చైనా ప్రతినిధులు టిబెట్టుకు పయనమై నేడిక్కడికి వచ్చారు. టిబెట్ విమోచన ఒప్పందంపై సంతకం చేయటానికి పెకింగ్ వెళ్ళిన నలుగురు టిబెటన్ ప్రతినిధులు కూడా వీరివెంట ఉన్నారు. వీరు జులై 4వ తేదీన కలింపాంగ్ మీదుగా టిబెట్టుకు బయలుదేరుతారు.

### ఇండియా చైనా మిత్రత్వం బలపడుతూంది

జనరల్ చింగ్‌వూ నేడొక ప్రకటనచేస్తూ, టిబెట్ శాంతియుతంగా విమోచన పొందటంవల్ల ఇండియా చైనాలమధ్య స్నేహబంధాలు బలపడు తవని అన్నారు.

"టిబెట్టు చైనానుంచి విడదీయటానికి వీలులేని ఒక అంతర్భాగం. చైనా జాతులలో ఒకటయిన టిబెటన్ జాతికి దీర్ఘచరిత్ర ఉన్నది. టిబెట్ శాంతియుత విమోచనకొరకై చర్చించే నిమిత్తం టిబెట్ స్థానిక ప్రభుత్వాధిపతి అయిన దలైలామా చైనా కేంద్ర ప్రభుత్వం దగ్గరికి ప్రతినిధులను పంపగా, మే 23న ఒప్పందం జరిగి, టిబెట్ శాంతియుత విమోచన జరిగినది.

ఈ విమోచనవల్ల చైనాలోని వివిధ జాతుల ఐక్యతవల్ల ఆసియాలోనూ, ప్రపంచంలోనూ స్థిరశాంతికి దోహదం కలుగుతుంది. శాంతినికోరే సుహృత్తర దేశమయిన భారతదేశానికీ, ప్రజలకూ యీ సందర్భంలో నా అభినందనలను అందజేస్తున్నాను." అని ఆయన అందులో వివరించారు.

### యుద్ధపరిస్థితి

టోక్యో, జులై 1: యుద్ధవిరమణ సంప్రదింపులు జరపటానికి కమ్యూనిస్టులు అంగీకరించి నప్పటికీ, మిత్రసేనాని వాన్‌ఫ్లీట్ సేడు కొరియా యుద్ధరంగ మంతట్లోనూ తన సేనలను కమ్యూనిస్టు సేనలను మోహరించి ఉంచారు. పశ్చిమ రంగంలో స్వల్పంగా శత్రుసంఘర్షణలు జరిగినవి.

యుద్ధవిరమణ ప్రతిపాదనకు కమ్యూనిస్టులు అంగీకరించినట్లు వార్త వచ్చిన తరవాత మిత్రసేనాని తన సేనల స్థావరాలను కదిలించలేదు.

తూర్పుతీరంలో మిత్రసేనా నౌకాదళం, ఈ తీర కొరియాపై మిత్రవిమానాలు దాడులు చేస్తూనేఉన్నవి.

## విశాఖజిల్లా బోర్డు ఉపాధ్యక్షుడు

విశాఖపట్టణము, జూన్ 30: ఇలప కుర్తి సత్యనారాయణగారు, విశాఖ జిల్లా బోర్డు ఉపాధ్యక్షులుగా ఏకగ్రీవముగా నిన్న జరిగిన జిల్లాబోర్డు సమావేశములో ఎన్నిక అయినారు. (స్వ. వి.)

నెల్లూరు, జులై 1: "రాబోయే ఎన్నికలు భారతి ప్రజలకు చావు బతుకుల సమస్యగా ఉన్నది. దేశ వ్యవహారాలను చక్కబెట్టలేక పోయిన కాంగ్రెసు ప్రభుత్వాన్ని తొలగించటంలో ప్రజలు వారు కోరుకొనే ఇతర కొత్త ప్రభుత్వాన్ని నచ్చినవారితో ఆ పని చేయగలరు." అని ఆచార్య కృపలాని నేడిక్కడ ఒక బహిరంగ సభలో హెచ్చరించారు.

"ప్రజల ప్రాథమిక సమస్యలను పరిష్కరించక పోయినందువల్ల ప్రస్తుత ప్రభుత్వం దేశంలో కమ్యూనిస్టు వ్యాప్తికి తోడ్పడుతున్నది." అని ఆయన ఆరోపించారు.

కొత్తపార్టీ విధాన ప్రకటన ఆయన ఆశ్వదే ఎన్నికల ప్రచారాన్ని ప్రారంభించారు. సమావేశానంతరం ఆయనకు కొంత విరాళం సమర్పింపబడ్డది.

## కాలక్షేపం

ఇంతవరకూ ఎన్నికల్లో రంగులకు విశేషప్రాధాన్యం ఉంటూవచ్చింది. కాంగ్రెస్ అంటే పసుపుపెట్టె అని చదువురానివాళ్ళకూడా సులభంగా తెలిసిపోయింది. పసుపుపెట్టె దొరికితే ఆఖరికి ఘూటికఫుల్లయినా ఏ సెంబ్లీ మెంబరై కూర్చునేది! అది రంగు మహత్యం.

ఎన్నికలు అయింతరువాత మెంబర్లను అసలు రంగు తెలుసుకొనేందుకు కూడా ఈ రంగుల ఎన్నిక వోటర్లకు వీలుగా ఉండేది. ఇప్పుడు ఈ పద్ధతులకు స్వస్తిచెప్పి, చిహ్నాలను ప్రవేశపెట్టుతున్నారు. వర్ణ నిరహిత ప్రజారాజ్య స్థాపనకు ఇంతకంటే దగ్గర దారిలేదు?

పైగా వోటర్లు ఏదో ఒక రంగును అభిమానించితే అది వర్ణ వివక్షతగా పరిగణించి ఏ న్యాయస్థానమైనా శిక్ష విధించవచ్చు. వర్ణక్రమం తెలియని వోటర్లు ఇన్ని వర్ణాల్లో ఏ వర్ణాన్ని వరించాలో తేల్చుకోవటంకూడా కష్టమౌతుంది. అవర్ణులు, సవర్ణులు అనే పేచీకూడా రావచ్చు.

రాజ్యాంగాన్ని సవరించి కుల విచక్షణ సమస్యను పరిష్కరించి నట్లే, ఎన్నిక రంగులను రద్దుచేసి వర్ణ వివక్షతను నిర్మూలించింది మన ప్రభుత్వం! అంతేగాదు - ఇప్పుడు అన్ని పార్టీల రంగూ ఇంచుమించు ఒకే రకంగా ఉంది. ఈ పార్టీది ఈ రంగు అని నిర్ణయించడం కష్టం.

* * *

మొన్న శనివారం రాష్ట్రంలోని రాజకీయపక్షాల ప్రతినిధులు అందరూ సమావేశమైనారు. ఎన్నికల్లో తమతమ చిహ్నాలను చెప్పుకున్నారు. ప్రజాపార్టీవారు (ఆంధ్ర) కేసరిని వదిలి ఏనుగును పట్టుకున్నారు! జంబూద్వీపానికి అంతకూ ఏమే కర్తలమని. రంగాగారు కిసాన్-మజ్దూర్ ప్రజాపార్టీని వదిలిపెట్టితే ప్రజాపార్టీవారు వదలివేసిన 'కేసరి'ని ఎన్నిక చిహ్నంగా ఎన్నుకోవచ్చు. అవిధంగా ప్రకాశంగారికే తమను వదిలిపెట్టారు గాని తాము ప్రకాశంగారిని వదిలిపెట్టలేదని రంగాగారు బుజువు చేసుకోవచ్చు! ఇదంతా కేవలం ఎన్నికలప్పటంటు అని ప్రకాశంగారి మనుష్యులు ప్రచారంచేసినా సాహిత్తు వోటుపెట్టెమీద సింహం కన్పిస్తుంటే ప్రజలు నమ్మరు.

* * *

కాంగ్రెస్ పసుపురంగుకు బదులు రెండెద్దులు కట్టిననాగల్ని ఎన్నుకున్నది. నేటి కాంగ్రెసు ప్రభుత్వానికి దున్నే రైతుమీదకంటే నోరులేని ఎద్దులమీదా, 'సజీవమైన' నాగలిమీదా ఎక్కువ అభిమానం ఉన్నట్లు కొందరు దీనికి అర్థం చెప్పవచ్చు కాని వోటు ఇవ్వటానికి వచ్చే రయితుకు కాంగ్రెసు అధికారంలోకి వస్తే ఉత్పత్తి సాధనలను ప్రసాదిస్తుందని ఈ చిహ్నం అంతరార్థం. రైతు వ్యవసాయ కూలీల శ్రేయస్సే కాంగ్రెసు లక్ష్యంఅని బుజువు చేయడానికి ఇంతకంటె వేరే ఏంకావాలి?

ట్రాక్టర్లను పెద్ద పెద్ద యంత్రాలను తెచ్చిపెట్టి గాంధిగారి చరఖా పరిశ్రమల ఉద్యమాన్ని అణచివేస్తుంది కాంగ్రెస్ అని సర్వోదయవారు చేసే ప్రచారంలో ఏమాత్రం సత్యం లేదని కూడా కాంగ్రెస్ వారు ప్రజలకు నచ్చ చెప్పవచ్చు.

తాటిచెట్టు ఎక్కేవాడుంటే, తలదన్నే వాడుంటాడు! కాంగ్రెసు రెండెద్దులు కట్టిన నాగల్ని కోరు కుంటే తమిళనాడు సోషలిస్టుపార్టీ వారు ఎద్దులులేని నాగల్ని ఎన్నుకున్నారు! పోతనకవి మరిఎద్దులు లేకుండా నాగలితో నే మడి దున్నించిన సంగతి కాంగ్రెసువారు మర్చిపోయినా సోషలిస్టులు ఎలా మర్చిపోతారు? శ్రీనాధుని బూర్జువా సత్యాన్ని ఖండించి, రాదరికాన్ని ప్రతిఘటించిన పోతన సోషలిస్టు మతానుయాయుడు కాదా! నాగలి ఒకటుంటే మిగిలినవి తాము సర్దుకోగలమని సోషలిస్టులు ఈ విధంగా తమ కనీసపు కోర్కెలను ప్రకటించటం బాగుంది! "అధికారం మాకిస్తే చాలు మిగిలినదంతా మేం చూచుకుంటాం" అన్న కీర్తి నినాదానికిది అనుగుణంగానే వుంది.

"వెనుక బడిన జాతుల లీగువారు గుర్రాన్ని ఎన్నుకున్నారు. 'ముందు బడిన' జాతులతో సమానం కావటమే గాక వార్ని వెనకబడిన జాతులుగా చేయడానికి గుఱ్ఱమునిని పరిగెత్తడం కంటె మార్గంలేదు. కాబట్టే వారు గుర్రాన్ని మంచి దూరదృష్టితోనే ఎన్నుకున్నారు.

* * *

కమ్యూనిస్టు పార్టీవారు తిరుగుబాటు, కొడవల్ని వదలిపెట్టలేదు. అయితే ఇదివరకటిలాగా తలకోయటం తగలకొట్టటానికి. గొంతులు కోయడానికి గాక, ప్రెసిడెన్సీని పంటలైన్ను బొంబాయి లాన్ని కోసి కుప్పలు వేయడానికీ, కౌలునులను పకలకొట్టడానికీ తాము ఇక కృషి చేస్తామంటూరు! కార్మిక కర్షక నియంతృత్వం విప్లవస్థాపనంటూరు!

* * *

ముస్లిం లీగువారు లాంతరు ఎన్నుకున్నారు. పాకిస్థాన్ విభ్రమతే, నాయకులంతా అక్కడికి వెళ్ళిపోయిన తరువాత దేశంలో ఉన్న ముస్లింలీగర్లకు దారిచెప్పేని కల్పించడంలేదు. అంతా అంధకారబంధురమై ఉంది. కనుక వారు లాంతరు పట్టుకోవడం అన్ని విధాలా ఉచితంగా ఉంది.

"కిద్వాయ్‌గారు చేరబోయేది ఏపార్టీ?"—ఇది పలువురిని బాధిస్తున్న సమస్య (శంకర్సు వీక్లీ)

# పాకిస్థాన్ యుద్ధవిరమణ ఒడంబడికఉల్లంఘనపైకరియప్ప ఫిర్యాదు

## అధికార్లతో చర్చిస్తానని సమితిప్రతినిధి హామీ

శ్రీనగర్, జులై 1: ఐక్యరాజ్యసమితి ప్రధాన సైనిక పర్యవేక్షకుడు మేజరు నిమ్మోగారును భారత పర్యసేనాధిపతి జనరల్ కరియప్పగారును జరిపిన సంభాషణల ఫలితంగా సరిహద్దు సంఘర్షణల విషయమై పాకిస్థాన్ ప్రభుత్వాధికారులతో చర్చింప 48 గంటలలో రావల్పిండి వెళ్ళ మేజర్ జనరలు నిమ్మో సమ్మతించెను.

యుద్ధవిరమణగీటు పొడుగున జరుగుచున్న దాడులను గూర్చియు, సంఘర్షణ పరంపరను గూర్చియు భారత సర్వసేనాపతి మేజర్ నిమ్మోతో చర్చించెను. ఈ సంఘటనలు ముఖ్యంగా కథువా-దున్నవార్ ప్రాంతంలో జరుగుచున్నవనీ పాకిస్థానీలలో వివిధ వర్గముల వారు పాల్గొంటున్నారని తెలుస్తున్నది. ఇటీవల ఒక భారత సైనిక కాపలాదళంపై పాకిస్థానీలు చాటుమాటుగా తుపాకులు కాల్చారనీ, ఇద్దరు భారత సైనికులు మరణించిరని, ముగ్గురు గాయపడ్డారని తెలుస్తున్నది.

ఈ ప్రాంతములో నానాటికి హెచ్చుచున్న సంఘటనలు ఉపద్రవకరమైనవని మేజర్ నిమ్మో అంగీకరించెను. ఈ విషయం పాకిస్థానీ అధికార్ల దృష్టికి తేబడేనని ఆయన చెప్పెను. ఈ ప్రాంతంలో పాకిస్థాన్ పోలీసులుగాక పాకిస్థాను సైనికులున్నట్లయి లేయిట్టివి జరుగవని మీ అభిప్రాయమా? అని మేజర్ కరియప్పగారడుగగా పాకిస్థాను సైనికులే అచ్చట ఉన్నయెడల అట్టి సంఘటనలు జరుగవని మేజర్ నిమ్మో అంగీకరించెను. ఈ విషయమును పాకిస్థాన్ అధికార్లతో చర్చింప వలసిందని అంతట జనరల్ కరియప్పగారు మేజర్ నిమ్మోను కోరగా, చాలామంది పాకిస్థానీయులు యుద్ధవిరమణ గీటుదాటి వస్తున్నారని, అట్లురాకుండా చేయుం దవలసిందనికూడ జనరల్ కరియప్పగారు మేజర్ నిమ్మోగారిని కోరారు. ఈ విషయమును పాకిస్థాన్ అధికారులకు తెల్ప మేజర్ నిమ్మో అంగీకరించారు. భారత సైనిక కార్యాలయం వారు తన కార్యాలయమునకు చేసిన ఫిర్యాదులపై తాను గైకొన్న చర్యను ఎప్పటికప్పుడు భారత సైనిక కార్యాలయానికి తెలుప మేజర్ నిమ్మో సమ్మతించెను.

### పాకిస్థాన్‌కు గోపాలస్వామి అయ్యంగార్ హెచ్చరిక

శ్రీనగర్, జులై 1: "యుద్ధవిరమణ ఒడంబడికను భగ్నంచేసే చర్యలను పాకిస్థాను సంపూర్ణంగా ఆపివేయని యెడల అందువల్ల కలిగే మహానర్థమునకు బాధ్యతయంతయు పాకిస్థాను ప్రభుత్వంపైననే వుంటుంది." అని భారతప్రభుత్వ సంస్థానశాఖ మంత్రి శ్రీ గోపాలస్వామి అయ్యంగారు కాశ్మీరు రేడియో ద్వితీయ వార్షికోత్సవ సందర్భమున ఆ రేడియో నుండి రికార్డు ఉపన్యాసంచేస్తూ పాకిస్థానును హెచ్చరించారు. భారత సైనికులు సరిహద్దున అప్రమత్తతతో కాపాలా కాయుచుండుటవల్ల జమ్మూ, కాశ్మీరుప్రజలు భీతినొంద నవసరములేదని ఈ ఉపన్యాసంలో అయ్యంగారు కాశ్మీరు ప్రజలకు ధైర్యం చెప్పారు. మహమ్మద్ జఫ్రుల్లాఖాను భద్రతాసంఘానికి విజ్ఞప్తి చేసినప్పటికీ నిర్ణీత సమయమున కాశ్మీరు రాజ్యాంగపరిషత్తు ఎన్నికలు జరిగితీరుతవనీ, ఈ పరిషత్తు సమావేశమును ఆపగలవారెవ్వరును లేరని శ్రీ అయ్యంగారు ఉద్ఘాటించారు.

ప్రజల జీవితము మామూలు స్థితికి వస్తున్నదనే అభిప్రాయము సంస్థానములో 12 రోజులు పర్యటించడంవల్ల తనకు కలిగిందని శ్రీ అయ్యంగారు చెప్పుతూ ఇలా అన్నారు:—

"కాశ్మీరు పరిపాలనయు యిప్పుడు నవీనమైనదిగాను, క్రమబద్ధమైనదిగాను, నమ్మదగినదిగాను వున్నది. దేశభక్తిప్రపూరితులగు నాయకులు దేశాన్ని పరిపాలిస్తున్నారు. తమ నాయకులు అంతరంగికమైన చిక్కులను, వెలుపలి నుండి కలుగు చిక్కులను తొలగింపగలరనే విశ్వాసము యావన్మంది ప్రజలకు యేర్పడియున్నది. శాంతిభద్రతా పరిస్థితి భారతదేశమునందలి యితర రాష్ట్రాలకంటె కూడ మెరుగుగా వున్నది. ప్రజల ధనప్రాణములకు భద్రత కలదు. విస్తారమైన భూసంస్కరణలు శాంతంగా సక్రమంగా జరిగినవి. ఈ సంస్కరణలవల్ల ఆర్థికంగా చాలా దెబ్బతిన్నవారు కూడ వాటికి సరిపెట్టుకొనుచుండుట నాకు ఆశ్చర్యము కలిగించుచున్నది. పరిపాలనా విధానంలో జరిగిన సర్వతోముఖాభివృద్ధి ప్రశంసాపాత్రముగా నున్నది. రాజకీయ పరిస్థితులు సంక్షోభింగా వున్నప్పటికీ ప్రజా ప్రభుత్వం ధైర్యంగా కృషి చేసి, శీఘ్రంగా పర్యగైకొని ప్రజల కష్టాలను తగ్గించగలుగుచున్నది.

### యుద్ధవిరమణ ఒడంబడికను భగ్నంచేయు చర్యలు

గత రెండు మూడు వారాలుగా కాశ్మీరు ప్రజలను భయభ్రాంతులనుగా చేయుటకు పాకిస్థాను గట్టి ప్రయత్నములు చేయుచుండెను. కాశ్మీరు సైనికులను, కాశ్మీరునందలి యితర సాయుధ సంస్థలను బుద్ధిపూర్వకముగా యుద్ధ విరమణ ఒప్పందమును ఉల్లంఘించి అనేకచోట్ల అనేకసార్లు యుద్ధ విరమణ గీటును దాటవచ్చిరి. ఇట్లు దాటవచ్చినందుకు బాధ్యతను పాకిస్థాను తప్పించుకొనజాలదు. యుద్ధ విరమణగీటుపొడుగున పాకిస్థాను ఒక నిర్ణీత కార్యక్రమమును ననుసరించి చిన్నదాడులు చేయ సంకల్పించుచున్నదను అనుమానము యుండుటవల్ల కలుగుతున్నది. ఈ ఉల్లంఘనల స్వరూపమునుబట్టి, సంఖ్యనుబట్టి చూచే యెడల యిట్టి అనుమానము అసమంజసము కానేరదు. వీటిని వెంటనే ఆపివేయని యెడల ఉభయదేశముల మధ్య భారీ ఎత్తున యుద్ధం ప్రారంభించుటకు ఏ నిమిషం బట్టిన ఆ నిమిషం సాకుదొరుకుతుంది. యుద్ధ విరమణ ఒడంబడికను భగ్నం చేయు, చర్యలను పాకిస్థాను సంపూర్ణంగా అపు చేయని ఎడల ఫలితములు మహానర్థదాయకముగా నుండునని యిందు మూలమున పాకిస్థానును హెచ్చరిస్తున్నాను. ఈ అనర్థములన్నిటికీ పాకిస్థానే సంపూర్ణంగా బాధ్యతవహించ వలసి వుంటుంది. భారత సైనికులు సరిహద్దున అప్రమత్తతతో కాపలా కాయుచుండుటచేత ఈ సంఘటనలవల్ల జమ్మూ, కాశ్మీరు ప్రజలు భయభ్రాంతులు కావలసిన కారణ మావంతయూ లేదు.

### రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలు

రాబోవు సెప్టెంబరు-అక్టోబరులో సమావేశము కానున్న రాజ్యాంగ పరిషత్తు ఎన్నికల విషయమై ప్రస్తావించుచూ శ్రీ అయ్యంగారు ఇలాఅన్నారు:

"ఈ యెన్నికల సన్నాహాలు పాకిస్థానుకు కోపకారణమైనవి. భారత ప్రభుత్వము, కాశ్మీరు సంస్థానాధికారులు రాజ్యాంగపరిషత్తును సమావేశపరచకుండా చేయడానికి తగిన చర్యలను, సమర్థమైన చర్యలను తీసికోవాలని కోరవిజ్ఞప్తిని, నిరాశాపూరితమైన విజ్ఞప్తిని, కొన్నాళ్ళ క్రిందట, పాకిస్థాన్ విదేశాంగమంత్రి జఫ్రుల్లాఖాన్‌గారు భద్రతా సంఘానికి చేసియున్నారు. ఈ విజ్ఞప్తివల్ల ఈ సమస్యపై భారత ప్రభుత్వ వైఖరి యేమీ మారదు. రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలు జరుగుతవి. నిర్ణీతసమయమున, కాశ్మీరు రాజ్యాంగపరిషత్తు సమావేశమవుతుంది. రాజ్యాంగ పరిషత్ సమావేశమును ఆపగలవారెవ్వరూలేరు. భద్రతా సంఘానికి వ్రాసిన లేఖలో మహమ్మద్ జఫ్రుల్లాగారు తన వాదనలు పద్ధతిననుసరించి సంగతి సందర్భాలను వికృతంచేసి వున్నారు. తిప్ప భారత దేశందని, భారతదేశం భద్రతాసంఘాన్ని ధిక్కరిస్తున్నదని అభిప్రాయం కలిగేటట్లున్నారు పాకిస్థాను పరిద్యున మార్గాన్ని అవలంబిస్తున్నదనీ, భద్రతా సంఘ ఆజ్ఞలను తిరస్కరిస్తున్నదనే అభిప్రాయం కలిగేటట్టున్నారు ఆయన విజ్ఞప్తిచేసియున్నారు. ఆయనకు పరిపాటియైన ఈ యెత్తులవల్ల ఎవ్వరూ మోసపోరాదు. రాజ్యాంగపరిషత్తును సమావేశపరుస్తున్నది కాశ్మీరు మహారాజా ప్రభుత్వమని, భారతప్రభుత్వానికి దానితో ఎట్టి సంబంధమూ లేదని భద్రతాసంఘం నమ్మేట్లు చేయాలనే కృతమ నమ్మటందుర్లటం. ఈ రాజ్యాంగ పరిషత్తును సమావేశపరచడానికి బాధ్యులెవరో చెప్పకుండా జఫ్రుల్లాఖాను తెలివిగా తప్పించుకొన్నారు.

## ఆటవిక కళాశాల వార్షికోత్సవం

### మైసూరు మహారాజా గారి ఉపన్యాసం

కోయంబత్తూరు, జూన్ 30: పాతిపుకారాశాల వార్షికోత్సవమునందు పట్టప్రదానోపన్యాసము చేయుచు, మైసూరు మహారాజాగారు అడవులసంపదను పూర్తిగ ఉపయోగించుటతోపాటు, అడవులు క్షీణించకుండా చూచుకొనుటయు, దేశ ఆర్థిక సౌష్ఠవమునకు అత్యవసరమని హెచ్చరించెరు. అడవులందుండు అడవి జంతువులను కూడా క్షీణించకుండా చూచుట ఆవశ్యకమనిరి. మహారాజాగారికి అడవి పరిశోధన సంస్థ అధ్యక్షులు సి. ఆర్. రంగనాథంగారు, కాలేజి ప్రిన్సిపాలు వై. ఎం. ఎల్. శర్మ, మున్నగు ఉద్యోగులు స్వాగత మొసంగిరి. రేంజరు విద్యార్థులు గార్డు ఆఫ్ ఆనరు ఒసంగిరి.

రంగనాథంగారు స్వాగత మొసంగుచు, 1948 నుండి యీ కాలేజి కేంద్ర ప్రభుత్వం వారి నిర్వహణను నందున్నదనియు, వివిధ రాష్ట్రాలలో రేంజరులను ఆఫీసరులను ఎక్కువగ ఉద్యోగమునందు నియమించుచుండుట నిరుడు ఆఫీసరు తరగతి నిలిపివేసి, రేంజరు తరగతులు గూడ రెండింటికి బదులు ఒక్కటే ఉండవలసి వచ్చిందనియు చెప్పిరి. దక్షిణాదికి కావలసినంత వరకు ఏటాదికి 30 నుండి 40 వరకు రేంజరుల శిక్షణ యిక్కడ జరుగుచున్నది.

మహారాజాగారు తమ ఉపన్యాసంలో అడవి సంపద పెంపొందవలసిన అవసరం గూర్చి తెల్పుచు, అడవులందు 40 లేక 50 సంIIలు పెరిగిన చెట్లను కొట్టివేయునపుడు తిరిగి మొక్కలను నాటే పనిగూడా చేయించు చుండాలనిరి. లేకున్న అడవు లదృశ్యమయి, వానలు లేక, పంట లేరుపలేక కరువధికం కాగలదని హెచ్చరించెరు.

అడవి జంతువులలో సింహంజాతి యిపుడు ఇండియాలో లేదు. అట్లే పులుల జాతిగూడ అదృశ్యంకాకుండా చూచుకోవాలన్నారు. తమ బాధ్యతలన్ని చక్కగ నిర్వహించుటకు అడవిశాఖ ఉద్యోగులకు తృప్తికరమగు జీతాలు యివ్వాలన్నారు

"కాశ్మీరు సంస్థాన రాజ్యాంగ నిర్మాణానికి రాజ్యాంగ పరిషత్తును సమావేశపరిచే విషయమును గూర్చి భారత రాజ్యాంగంలో ప్రస్తావన కలదని, ఈ పరిషత్తును సమావేశపరిచే అధికారం కాశ్మీరు అధిపతి కున్నప్పటికి దానిని సమావేశపరిచే చర్యను భారత ప్రభుత్వంవారు సంపూర్ణంగా ఆమోదిస్తున్నారని స్పష్టం చేయబడియుండెను." అని శ్రీ గోపాలస్వామి గారు చెప్పారు.

కాశ్మీరు రాజ్యాంగపరిషత్తును సమావేశపరిచే ఉద్యమం భద్రతా సంఘం 1951 సం॥ మార్చి 30 తేదీన చేసిన తీర్మానానికి విరుద్ధమనే జఫ్రుల్లాఖాను వాదం విషయమై శ్రీ గోపాలస్వామిగారు ప్రస్తావిస్తూ ఈ తీర్మానం జరగడానికి పూర్వం భద్రతాసంఘంలో జరిగిన చర్చలలో రాజ్యాంగపరిషత్తును సమావేశపరిచే విషయం చర్చకు వచ్చిందనీ, ఈ తీర్మానం జరిగిన కొద్ది రోజులకే రాజ్యాంగపరిషత్తును సమావేశపరిచే ప్రకటన జరిగిందని చెప్పతున్నారు. కనుక ఈ రాజ్యాంగపరిషత్తు విషయమై భద్రతాసంఘ తీర్మానంలో ప్రస్తావన లేకపోవడానికి తగిన కారణా లుండాలని అంటున్నారు. ఈ పరిషత్తును సమావేశపరచడంవల్ల కాశ్మీరు సమస్య శాంతియుతంగా పరిష్కారం చేసే అవకాశం లేకుండా పోయేయెడలను, అంతర్జాతీయ శాంతికి ఉపద్రవం కలిగే యెడలను భద్రతా సంఘమువారు ఆ విషయమును తమ తీర్మానంలో స్పష్టంగా తెలిపే వారని శ్రీ గోపాలస్వామిగారు చెప్పతూ, ఈ కారణంచేత జఫ్రుల్లాఖాన్ వాదం నిస్సారమైనదని అంటున్నారు. కాశ్మీరు ప్రత్యేక రాజ్యమైనప్పటికి అనేక శతాబ్దములుగా భారత దేశంలో అంతర్భాగంగా వుండెను. పాకిస్థానులో చేరటానికి కాశ్మీరు నిరాకరించింది. సర్వాత్మనా భారత దేశంలో చేరింది. ఇప్పుడు కాశ్మీరు భారత దేశంలో అంతర్భాగంగా వున్నది. ఇకమీదట కూడ భారత దేశంలోనే వుంటుంది. కాశ్మీరు ప్రజలు తమ పాలనుని ద్వారాను, నాయకుని ద్వారాను ఈ నిర్ణయంచేసి కొన వలసి యున్నారు. జనవాక్యం గా కొన్నప్పుడు, ప్రజలలో అత్యధిక భాగం భారత దేశం వుంపడానికే వోటుచేస్తారనుట నిస్సంశయం" అని శ్రీ గోపాలస్వామి అయ్యంగారు చెప్పిరి.

దుష్ప్రచారాన్ని ప్రతిఘటించవలసిన కాశ్మీరు రేడియో చేస్తున్న ప్రశంసనీయ సేవను శ్రీ గోపాలస్వామిగారు ఉగ్గడించారు.

### షేక్ అబ్దుల్లా సందేశము

కాశ్మీరు రేడియో తృతీయ వార్షికోత్సవ సందర్భమున కాశ్మీరు ప్రధాని ఒక సందేశంపంపుతూ కాశ్మీరు రేడియో ప్రజల జాతీయ, ఆధ్యాత్మిక, వైజ్ఞానిక, ఆశయములను ప్రతిబింబించ దానికి కట్టకృషి చేయాలని కోరుచున్నారు. రేడియోవారు నానాటికి వృద్ధిపొందగలరని ఆశిస్తున్నారు. భారతదేశంనుండి అనేక రాయబారులు కూడ కాశ్మీరు రేడియోకు శుభాకాంక్షలు తెలుపు సందేశం పంపియున్నారు.

## సంపాదకునకు లేఖలు

### ఎస్. ఎస్. ఎల్. సి. సప్లిమెంటరీ పరీక్షలు

ఆర్యా, ఎస్. ఎస్. ఎల్. సి. సప్లిమెంటరీ పరీక్షలు యీ ఏడాది అక్టోబరు 15 నుండి జరుగగలవని గజెట్ ప్రకటనవల్ల తెలుస్తున్నది. ఈపరీక్షల ఫలితాలు సాధారణంగా డిసెంబరు మాసాంతంలో ప్రకటిస్తారు. తప్పినవారు నవారు మళ్లా మార్చి పరీక్షకు హాజరు కావాలంటే వున్న మూడునెలలు వ్యవధిలోనూ, క్రొత్త పుస్తకాలు చదివి పరీక్షకు హాజరు కావటం కష్టమనే విషయాన్ని అధికారులు గుర్తించి ఈ పరీక్షలను సెప్టెంబరులోనే జరుపునని కోరుతున్నాను.

గుంటూరు. వకుర్యేముల మల్లికొర్జునరావు.

### మేడూరు వైద్యశాల

ఆర్యా, మా మేడూరు గ్రామంలోని జిల్లాబోర్డు వైద్యశాలలో గత నవంబరునుంచి వైద్యుడే లేడు. చుట్టుపట్ల అనేక గ్రామాలవారు ఆధారపడే యీ గ్రామ వైద్యశాలలో వైద్యుల్ని నియమించవలసిందిగా జిల్లాబోర్డు వారిని కోరుతున్నాను.

మేడూరు. సుర్లపల్లి వెంకయ్య పంచాయతీబోర్డు అధ్యక్షుడు.

### లేఖాంశాలు

మద్రాసు నుంటులో బయట వూర్లకు వెళ్ళే బస్సుస్టాండు యిటీవల కృష్ణాటాకీసు ప్రక్కనవున్న స్థలానికి మార్చినందున ప్రయాణీకులకు చాలా యిబ్బందిగా నున్నదని ప్రయాణీకులకువైతున్ని వసతులు వంటనే ఏర్పాటు చేయవలసిందనీ జి. నరసింహమూర్తి గారు (చాకలిపేట) అధికారులను కోరుతున్నారు.

తాడేపల్లిగూడెం - మార్టేరు మధ్య తిరిగే ఒక బస్సులో ఎక్కువ రేట్లు వసూలు చేయటమేకాకుండా అసలు టిక్కెట్లే యీయటంలేదని, ప్రయాణీకులను బస్సువుద్యోగులు చులకనగా చూస్తున్నారనీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి గారు ఫిర్యాదు చేస్తున్నారు.

ప్రతి సంవత్సరమూ ఎస్. ఎస్. ఎల్ సి. ఇంగ్లీషు పరీక్షా పత్రంలో 'కోటింగ్' (పద్యాలను యధాతథంగా జ్ఞప్తికి తెచ్చుకు వ్రాయటం) ప్రశ్న వుంటూ వుండగా క్రిందటిసారి జరిగిన పరీక్షలో ఈ ప్రశ్న వదలివేసినందువల్ల ఒక ప్రశ్నకైనా కచ్చితంగా మార్కులు వచ్చే అవకాశం తిరస్కరించినట్లయినదని అభిప్రాయపడుతూ ప్రొద్దుటూరు 'సమాజవాది యువకసభ' వారుపై పరీక్షలలో యీ ప్రశ్నను వదలివేయవద్దని అధికారులను కోరుతున్నారు.

ప్రభుత్వంవారు తమ లెక్కలలో మిగులు ప్రాంతంగా దాఖలు చేసు కొన్న కళ్యాణ దుర్గంలో బియ్యం పల్లా 1-కి రు. 100/-రాగులు రు.60/-పచ్చజొన్నలురు.40/-అమ్ముతున్నారనీ, ప్రభుత్వం వెంటనే తగు చర్యలు తీసుకోవాలనీ వి. బసన్న గారు లేఖవ్రాశారు.

చంద్రగిరిలో రేషన్ షాపులు జనరలీలో యెత్తివేసినప్పటికీ, వాటి బాపతు 'డిపాజిట్లు' యింతవరకు వాపసు చేయలేదని సి. కేశవయ్యనాయుడు గారు జాబు వ్రాశారు. ఏ. సి. టి. ఓ గారు అన్యక్రం పన్ను లెక్కలను సరిజూడటం త్వరలో ముగించనైనా ముగించనునీ, ఈ అమ్మకం పన్నుతో సంబంధంలేని డిపాజిట్లను త్వరగా వాపసు ఈయటమైనా జరిపించమనీ ఆయన అధికారులను వేడుతున్నారు.

భద్రాచలంలో రసాయనిక ఎరువులు లభ్యంకావటంలేదని ఎరువులు వేసేతరుణంమించిపోకముందే రైతులకు వాటినిఅందుబాటులోకి తెప్పించమని కూను సత్యనారాయణరావుగారు ప్రభుత్వాధికారులకు విన్నవిస్తున్నారు.

గుమ్మపురం నాపరాల మధ్య తిరిగే రైలుబండ్లలో రాత్రివేళల దీపాలు కానీ పగటిపూట ఫాను గాని సమయములలో స్టేషనులలో మంచినీళ్లు కాని వుండటం లేదని బొబ్బరము సుబ్బ బ. రఘురాం ప్రభూ రాజాచక్రవర్తి రాజు గార్లు ఫిర్యాదులు చేస్తున్నారు.

నెల్లూరునుండి ప్యూర్లు శ్రీ రాయుడు వ్రాసినలేఖలో, మద్రాసు ప్రభుత్వమువారు తెల్పుచున్న వెనుకబడిన జాతుల జాబితాలో కేవలము చేనేతయే ముఖ్యవృత్తిగ కలిగి, ఆర్థిక సాంఘికాదులలో చాలా వెనుకబడివున్న 'పద్మశాలీ' కులము వారిని కూడా చేర్చవలసినదిగా, కోరుతున్నారు.

నందిగామ తాలూకాలో పెరుకలగనాసెట్టవారుపరవులలోనూ,నరలలోనూ కలిసినసందున దె ఆకాతో చిత్తానికా చిత్రాలు కూడా వేయకలగ చిత్రాలతో కలిసి నూనె తీస్తున్నారనీ, ఇందువల్ల ఆరోగ్యానికి హాని జరిగి దీనిగూడ ఆరోగ్యం భంగమౌతోందనీ శ్రీ ప్రభాకర ప్రసాద్ గారు ఫిర్యాదు చేస్తూ ఆరోగ్యశాఖాధికారులను తగు పరీక్షలు జరుపమని కోరుతున్నారు.

గొనపపుట్టునగలో వున్న ఒక్క బావి నీటిపై చుట్టుప్రక్కల పలు గ్రామాలవారు ఆధారపడుతూ వున్న కారణాన, ప్రభుత్వం మరొక బావి త్రవ్వకానికి రు 4000/-లు మంజూరు చేసినప్పటికీ కంట్రాక్టు యివ్వటం యింతవరకు జరుగలేదని బాలక బ్రహ్మ రావుగారు వ్రాశారు. వెంటనే కంట్రాక్టు ఇచ్చి పని ప్రారంభింపచేయాలని అధికారులను కోరుతున్నారు.

